# నివేదన

నళిని
గీతికలు

ఆంధ్ర మహిళా సభ
ప్రచురణ : 1966

"నేను సైతం
భువనఘోషకు
వెర్రిగొంతుక విచ్చి మ్రోశాను."

— శ్రీశ్రీ

దుర్గమ్మను కన్నయమ్మ
మహిళాసభ మూలపుటమ్మ
చాల దొడ్డమ్మ



స్వర్గీయ బెన్నూరి కృష్ణవేణమ్మ
అమ్మమ్మగారు

అక్షరోపహారం



# అమ్మమ్మ గారికి

డగ్గుత్తిక లీ గీతిక;
లగ్గలమగు భక్తి మీర లస; మీ స్మృతికిన్
తగ్గ బహూకృతి కానక,
సిగ్గుపడుచు నిడుదు కృతిగ చిరుత కయితనే.

— బాలాంత్రపు
నళినీకాంత రావు

# అమ్మమ్మగారు

అమ్మమ్మగారి స్మృతికి 'తగ్గ బహూకృతి కానక-సిగ్గు పడుచు' చిరుత కయితలైనా అక్షరోపహారంగా ఇవ్వ గలిగారు నళిని. ఆ మాత్రం కూడా ఇవ్వలేని నాకు సిగ్గు పడడం ఒక్కటే మిగిలింది.

మనుషుల్లో రెండు రకా లున్నారు. సుఖదుఃఖాలను హృదయమారా అనుభవించి, ఆ అనుభవాన్ని దాపరికం లేకండా పది మంది యెదటా ప్రదర్శించగల దార్ఢ్యం, చిత్తశుద్ధి కలవా రొక రకం. కష్టాల్లో కంట తడిపెట్టడానికీ, ఆనందము వచ్చినప్పుడు అందలమెక్కడానికీ సాహసం చాలక, తమలో తాము ముడుచుకు పోయే వారు రెండో రకం.

మొదటి తరహాకి చెందిన వ్యక్తి అమ్మమ్మగారు – రెండో రకం మనిషిని నేను. మా రెండు తరహాలనీ జతపరిచి ఆరోజుల్లో – అంటే 1940 ప్రాంతాన్ని – నే నొక కథ వ్రాశాను– 'ఉద్వేగాలు' – అని. ఆ తరువాత అమ్మమ్మగారు, నా కథల్లో నాలుగయిదింటిలో కథావస్తు వయారు. అంచేత పరోక్షంగా నేను అమ్మమ్మగారికి చాలా ఋణపడి ఉన్నాను. ఆ బాకీ తీర్చుకో లేనని నాకు తెలుసు. ఆ సంగతి మనసువిప్పి ఆవిడ బ్రతికుండగా ఆవిడతో చెప్పుకోడానికి సాహసం లేకపోయింది. అందుకనే తప్పించుకు తిరిగాను. ఋణగ్రస్తుడి

మన స్త్రీత్వం నాది. అమ్మమ్మగారు ప్రశాంతమయిన చిరునవ్వుతో నా అవివేకాన్ని మన్నించే ఉంటారు. అదొక్కటే నాకు మిగిలిన ఆశ.

నళిని వ్రాసిన 'నివేదన'లో – అడ్డాటలో అమ్మమ్మగారికి ఇష్టమైన 'వా.ప'ని నేనే. అప్పుడు 'ఆంధ్రమహిళాసభ' అమ్మమ్మగారూ, అక్కయ్యగారూ కలిసి నాటిన చిన్ని మొలక. ఈనాడు అది అమ్మమ్మగారి చలవవల్ల, అక్కయ్యగారి పోషణవల్ల మహావృక్షమై శాఖోపశాఖలు దేశమంతా విస్తరింపజేసి, మహిళాలోకానికి చల్లని నీడను ప్రసాదిస్తోంది. వారికృషి భగీరథ ప్రయత్నం. వారి జీవితం మహాతపస్సు. వారిసాధనను పొగడ్డం పునరుక్తి అవుతుంది. అటువంటి అమ్మమ్మగారికి అడ్డాటలో భాగస్వామిని నేను, మా దెప్పుడూ ఓటమే. ఓటమికి బాధపడేవాణ్ణి నేను. అయితే అమ్మమ్మగారిది ఓటమి నెరగని అమాయకత్వం. ఆ అమాయకత్వానికి నా జోహార్లు, నా కథల్లో అప్పుడప్పుడు అర్పించాను.

1942 లో ప్రపంచమంతా అగ్నికుండంలో మ్రగ్గిపోతున్నప్పుడు–జపాన్ దాడులకి జడిసి, మద్రాసు వదలి ప్రజలు వివిధ ప్రాంతాలకు తరలిపోతున్న రోజుల్లో – అమ్మమ్మగారూ, కుటుంబంకూడా మద్రాసు తాత్కాలికంగా వదలిపెట్టాలని నిర్ణయించుకున్నారు. ఆంధ్ర మహిళాసభకు అప్పటికే లక్షలు విలువ గల ఆస్తిపాస్తులు సంపాదించి పెట్టిన వారికి, రైలుఖర్చుల కైనా సొమ్ము దగ్గరఉందో లేదో సందేహం.వారంతా ప్రయూ

ణాన్ని గురించి తర్జనభర్జన పడుతున్నప్పుడు నేను వా రింటికి వెళ్ళాను. అమ్మమ్మగారు ఎప్పటి చిరునవ్వుతోనే 'పద్మరాజుగారొచ్చారు, పేకాడదామా?' అన్నారు. తరవాత తరవాత ఇది నెమరువేసుకోగా లండన్‌నగరము మీద బ్లిట్జ్‌క్రీగ్ సాగుతుండగా తాపీగా డిన్నర్ టేబిల్‌వద్ద కూర్చుని తన భోజనం సాగించిన చర్చిల్ జ్ఞాపకి వచ్చాడు. బెర్నార్డ్‌షా ఒక నాటకంలో నెపోలియన్‌చేత అనిపించాడు, 'బ్రిటిష్ వారిని ఓడించడం అసంభవం. ఓడిపోయామన్న సంగతి వాళ్ళకి అర్థం కాదు', అని. ఓటమి అన్నది అసలు అమ్మమ్మగారి నిఘంటువులో లేదు. అందుకే కేపెల్లా గడుస్తుందో తెలియని కుటుంబపరిస్థితుల్లో, ఆంధ్ర మహిళాసభను చిరస్థాయిగా చెయ్యగలిగారు.

అనాదినుంచీ వస్తున్న సంస్కారబల మేదో అమ్మమ్మగారిలో ఉంది. అన్ని మత ప్రభావాలనూ, అన్ని తార్కిక సిద్ధాంతాలనూ, అన్ని దర్శనాలనూ తనలో ఇముడ్చుకున్న హిందూమత దార్ఢ్యం, వైశాల్యం ఆమెలో మూర్తీభవించాయా అనిపిస్తుంది. సాంప్రదాయికమైన వాతావరణంలో పుట్టి పెరిగి, అతి నూతన భావాలను ఆకళించుకుని, విప్లవాత్మకమైన మార్పులకు అనుగుణంగా అతి సహజంగా తన జీవితాన్ని మలుచుకుని, పాతకొత్తలకు అవినాభావం తన వ్యక్తిలోనే సృష్టించుకున్న ధన్యజీవి అమ్మమ్మగారు.

వారికి అక్షరోపహారం అర్పించి, ధన్యులయారు నళిని.

— పాలగుమ్మి పద్మరాజు

# చెప్పవలసిన మాట

ఆంధ్ర మహిళాసభ తన అభివృద్ధి కంతటికీ మా అమ్మ కెంతగానో ఋణపడి ఉంది. ఆమె జ్ఞాపకం చిరస్థాయిగా ఉండడానికి సభ ఏంచేసినప్పటికీ, అది స్వల్పమే అవుతుంది. ఈ 'గీతిక'ల ప్రచురణ మొదలెట్టుతున్నాం - ఆమె కంకితమైన వీటిని ముద్రించి సభ చిన్న కానుకగా నివేదిస్తోంది. నళిని ఈ కృతికర్త కావడమువల్ల, కృతి ఒక విశిష్టమైన ప్రాధాన్యం కలిగి ఉంది. ఎందువల్ల నంటే, నళిని ఆమె అభిమాన దౌహిత్రులలో ఒకడు; అంతే కాక, ప్రారంభదశలలో మహిళాసభ నిలువ దొక్కుకుని, ప్రవర్ధమాన మవుతూ రావడానికి పాటుబడివున్న బహు కొద్ది మందిలో తా నొకడు. అందుచేత, సభ సంతోషపూర్వకంగా ఈ 'గీతికలు' అచ్చువేసి, కవితా ప్రియులు, గానరసజ్ఞులు అయిన ఆంధ్ర మహాజనులకు సమర్పిస్తోంది.

దుర్గాబాయి దేశ్‌ముఖ్
వ్యవస్థాపకురాలు, అధ్యక్షురాలు
ఆంధ్ర మహిళాసభ

# ఆ శీ స్సు

ఏదీ? నీ ఔదల, నా
మోదాశ్రుల జారనీ! నళినీ!

నీ గీతికలు నా కెంతో నచ్చాయి...కొన్ని గీతికల గుణ విశేషం బట్టి చూస్తే, నువ్వు ప్రతిభలో మీ నాన్నకీ, మామయ్యకీ తీసిపోవని చెప్పాలి.

— దేవులపల్లి కృష్ణశాస్త్రి

# వందనాలు

చంద్రునకు నూలుపోగన్నట్లు, అమ్మమ్మగారి దివ్యస్మృతికి నా గీతికలు గుదిగ్రుచ్చి అంకితం చేశాను....

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్, శ్రీ బెన్నూరి నారాయణరావుగార్లు నన్ను ఆత్మీయులలో ఒకణ్ణిగా ఎంచి, నా కుచేల బహుమానానికి సంతసించి, గౌరవించారు.

ఆంధ్ర మహిళా సభవారు నాయందు అభిమానంఉంచి, నా ఉపాయనాన్ని ఆమోదించి, అమ్మమ్మగారి వర్ధంతినాటికి పుస్తకరూపంగా వెలువరించి, నన్ను గౌరవించారు.

గురువరేణ్యులు శ్రీకృష్ణశాస్త్రిగారు, శిష్యపరమాణువును నేను. 'మామయ్య'గారికి కావలసినవాణ్ణి కూడా. వారిమ్రోల మోకరించి, చేతులు జోడించి, ఔదల వంచి ఘనమైన వారి ఆశీస్సును గ్రహించాను.

నా అక్షరోపహారమంతా ఒక ఎత్తు. సుహృద్వరులు శ్రీ పద్మరాజుగారు అమ్మమ్మగారికి అర్పించిన జోహారు ఒక ఎత్తు, ఇద్దరమూ, 'తమలో తాము ముడుచుకు పోయే' వారమే. ఆవిడ ఉండగా నేనూ మనసు విప్పి చెప్పుకోలేకపోయినవాణ్ణే, 'పా.ప' గారి జ్ఞాపకాలు చదువుతోంటే, నా కన్నులు మళ్ళీమళ్ళీ చెమ్మగిల్లాయి.

ప్రఖ్యాత [illegible]త్రకారులు, కావలి విశ్వోదయవారి సంగీత - చిత్రలేఖన క[illegible] ప్రిన్సిపాలు అయిన శ్రీకౌతా రామమోహన శాస్త్రి

అన్నగారు నాగీతికలు అలరించగా, నాకు అమ్మమ్మగారి చిత్ర
మును వ్రాసిపెట్టి అనుగ్రహించారు.

అసలు నాకు ఆదిలో ఈ అమూల్యమైన అవకాశం కలుగజేసిన
వారు సభాకార్యదర్శిని శ్రీమతి లక్ష్మీపార్వతిగారు.

పొందికగా అచ్చువేసి యిచ్చారు నా చిన్నిపొత్తాన్ని, ఆంధ్ర
మహిళా ప్రెస్‌వారు.

పైవారందరికీ నా హృదయపూర్వకమైన వందనాలు.

కృతికర్త

# నళిని
# గీతికలు

కృత్యాది

ప్రశంసా గీతికలు

ప్రణయ గీతికలు

ప్రకీర్ణములు

నాటికలనుండి

పిల్లలగీతికలు

# భావసంకీర్తనం

నవకవితా ప్రబంధ శుకంబు నాదన్న,
 పలికింతు నింతలో వంత మేల?
జాతీయ సుకవితా శారిక నాదన్న
 చెప్పింతు నింతలో చింత యేల?
మధుర భావకవిత్వ మధుపంబు నాదన్న,
 వినిపింతు నింతలో వింత యేల?
అభ్యుదయకవిత్వ హంసంబు నాదన్న,
 రప్పింతు నింతలో రంతు లేల?
లలిత పదకవితా కోకిలంబు నాది
యున్న, పాడింతు నింతలో నంత యేల?
ఇంత గీర్వాణమా యన కిష్ట మేదొ
సుంత సెల విమ్ము నిన్ను మెప్పింతును ప్రభు!

★ ★ ★

కలుముల చెలికి పురస్కృతి,
మలరాయని కన్నియకు నమస్కృతి, పలుకుం
జెలువకు సత్కృతి యనగా
ఇల నీ కృతి వెలయుగాక ఇష్టార్థములన్!

బాలాంత్రపు వేంకటరావు
(వేంకటపార్వతీశ్వరకవులు)

# ఆత్మ పరిచయం

పన్నీరై పెన్నేరై
కన్నీరై ప్రవహించిన
జంటకైత యేటిలో
కెల పిడని పాయలు :

నళినీ నయన మధుకరుని
పక్షాంచలముల రంగులు;
రజనీహిత శీతకరుని
రాగ సుధాఝరి పొంగులు :
రాజు వెలుగు రవితేజపు కెంపుల !-
శశాంక డోలయు రజని యింపుసొంపుల !—

తొలి వేకువ తూరుపు దెస
తోచే కెంజాయల
ఏచు మరుద్వీచికలను
లేచు ఇనుడు తానే !

తెలివెన్నెల బయలులోన
దెస లల్లే తారల
మిలమిల మను కాంతులలో
వెలుగు కళని నేనే!

కావ్య కారయిత్రి కాత్మ
కారకుండు తానే!
క్రమ భావయిత్రి మనః
కారకుండ నేనే!

భావ నీల మేఘానికి
పాట మెరుపు నేనే!
రావష్ట పెను నాడి వేడి
రవులు ఉరుము తానే!

* * *

మహిళాజన మధురాశయ
మహోద్యాన సీమ
'మాతామహి' యైన పెద్ద
మర్రిచెట్టు నీడ -

నీడ పెరుగు లేయెదదల
వాడని విరు తొలంయు
పలుకు కైత పందిరులను
నిలిపె తోటమాలి - తాను !

మాలి పలుకు పందిళ్లకు
మేలి రాగముల తోరణ
మాల లల్లి నద్దిక్కుల
కీలించిన గాలి నేను !

- ర జ ని
[బాలాంత్రపు
రజనీకాంతరావు]

**

గుండె నైతే మే మిద్దరం
పంచుకున్నాం సుమండీ–
గొంతు మాత్రం వాడికే
దఖలు పడింది లెండి!

గుండె గుండియ లోనె
గుబగుబ లాడు పిడు - నళిని;
'గుండె గొంతుక లోన
కొట్లాడు' వాడు – రజని :
వర సంగీతమై
వరలును వాడు.
వంశ దీపకుడై
వెలుగ గలాడు!

వట్టి గీతమై
వినరాను నేను -
వాడే పి డని,
వద్దు, చెప్పు కోను!

కుశలవుల మనుకోడానికి
    కుదిరినవి పేరులే నండి.
సహోదరుల మైన మా
    సమాచార మిదండి.

— న ళి ని

# ఆ శం క

ఆరుద్రగారికి :

ఎన్నాళ్ళకు మళ్ళీ నే
  క్యూలో నుంచున్నా !-
ఎందుకు కునికే వత్తిని
  హెచ్చించా వన్నా?

నీ అడుగుల వెంబడి వడి
  నడువంగా నోతునే,
ఏ క్షణ మైనా తడబడి
  చదికిలబడి పోవనే!

తుద చూడగ లే నన్నది
  ఖాయమైన మాటలే,
తొక్కుడు పడకుండా నీ
  సాయ మున్న చాలులే!



ఉత్తరువై వెళ్లిపోయారా
అమ్మమ్మగారూ
ఉత్తరాయణ పుణ్యకాలంలో –

# నివేదన

ఉత్తరపైపై వెళ్ళిపోయారా, అమ్మమ్మగారూ !
ఉన్నపాటున, నిర్విచారంగా-
ఉత్తరాయణ పుణ్యకాలంలో,
ఉత్తములు చేరే చోటికి :

నియమితమైన కార్యభారం
నిక్కచ్చిగా నిర్వర్తించి-
మహిళాసభ రజతోత్సవాలు
మహోజ్వలంగా జరిపించి-
అమ్మాయినీ, అబ్బాయినీ
స్నేహితులుగా చూసుకుని,
స్నేహితులైన వారందరినీ
ఆత్మబంధువులుగా చేసుకొని-
మునిమనుమలతో వినోదించి
ముచ్చట లన్నీ తీరి-
పండు వయస్సులో,
నిండు తృప్తితో-

వెళ్ళిపోయారా, అమ్మమ్మగారూ !
విమాన ప్రయాణం చేసినట్టు-

ప్రాప్తం లేకపోయింది నాకు
కడసారి చూడడానికి,
పెట్టిపెట్టలేదు మిమ్మల్ని
సాగనంపడానికి-
పిలిచారు నేడు, సంతాపం
వెలిబుచ్చుకో మని-
పిలిచాను నేను, శ్రద్ధాంజలి
పట్టడానికి :

సంక్రాంతినాడు మీ సరస కూర్చుని
సంభాషించి నప్పుడు తెలియలేదు-
శ్రాంతు లనుకున్నాను గాని
సన్నద్ధు లనుకోలేదు—మా
సౌఖ్యం విచారించారు,
సంతసించారు—

సంక్రాంతి భక్ష్యాలు తినిపించారు,
సంతృప్తి చెందారు-
శ్రాంతు లనుకున్నాను గాని
సన్నద్ధు లనుకోలేదు—

కృష్ణా, రామా అనుకుంటూ
కుటుంబరక్షగా ఉండగల రనుకున్నాను-

పుస్తకాలు కట్టకట్టి సభకి
పంపించి వేశా నన్నారు-
హిందీ డిక్షనరీ ఏ మైంది, మన
యిద్దరికీ యిష్ట మైంది అన్నాను—
ఎవరో పాఠం చెప్పమంటే, మనవడి
కిచ్చి మళ్ళీ పుచ్చుకున్నా నన్నారు—
ఇంకా పాఠాలే !
రాష్ట్రపతి బహుమానం
రావలసింది మీ కనుకున్నాను !

పెదవిమీద స్వచ్ఛమైన చిఱునవ్వుతో,
ముఖంలో అచ్ఛమైన నిర్మలత్వంతో—
కళ్ళల్లో గంతులు వేసే ఆదరంతో,
కంఠంలో గింగురుమనే ఆప్యాయంతో-
మూర్తిమంతమైన అనుగ్రహం,
ముమ్మాటికీ మీ విగ్రహం !

'వినా దైన్యేన జీవనం,
సునా యాసేన మరణం"-

అనుకుంటూండే వారు,
అలాగే వెళ్ళిపోయారు -
పుణ్యాత్ములు మీరు,
ధన్యజీవులు మీరు !

ఎందర మిక్కడ సమావేశ మయామో.
అందరికీ అమ్మమ్మగారూ !
ఎవరివల్ల మన కీ బాంధవ్యం
ప్రసాదించారో, ఆవిడకి మా సాంత్వనం-

మహిళాసభ కుటుంబ బంధ మైంది,
మిమ్మల్ని బట్టే అమ్మమ్మగారూ !
చనవుచేసి మీరు చిట్టితల్లుల్ని
చేర్చబట్టే కదా,
బృందావన చిన్నారుల
బృందం మొదట ఏర్పడింది?

ఆనాటి మనుమణ్ణి,
అమ్మమ్మగారూ !
అణచరాదు, నా హృదయ యావేదన -
ఆలకించండి, యిది మీకు నివేదన :

అలా మీరు కూర్చుండేవారు,
అమ్మలు, అక్కలు కూడేవారు—
అమ్మలక్కలు కారు వారు,
ఆశమ్మ బూశమ్మ కబుర్లు కావు వారివి !—

అలా మీరు కూర్చుంటుండేవారు,
అక్కడ నలుగురూ చేరుతుండేవారు—
హిందీ నేర్చుకునేందుకో
హితవు వినేందుకో-

ఒకచేత రాట్నం త్రిప్పుతూ,
ఒకచేత రాగసూత్రం పెన వెట్టుతూ-
వారిని బంధించి వేశారు,
వారికి బంధు వసూరు !

మిమ్మల్ని పెట్టుకుని మెల్లిగా
ఒకశాఖ వెలసింది-
మీ రాలంబంగా మెల్లిగా
అది చెట్టయి నిలిచింది-
మిమ్మల్ని కట్టుకునే కదా,
సభ అవిచ్ఛిన్నంగా నడిచేది !

దూరానవుండే దుర్గమ్మగారి కింక
'హాజరు' చెప్పే దెవ్వ రిక్కడ?

చెట్టు ప్రాను కట్టింది,
శాఖోపశాఖలు పెట్టింది-
చెట్టు మొదట తిష్ఠవేసుకుని మీరు,
చెరగిపోని దృశ్యం !-

చెట్టు పెద్ద వృక్ష మైంది,
సేవ లొసగి మాన్య మైంది-
కాశీమజిలీ కథలలో
కానవచ్చే మహావృక్షం !

ఒక కొమ్మ పట్టుకు వెడితే,
చేపతుంది శాంథోమ్-ఇం
కో కొమ్మ పట్టుకు పోతే,
వస్తాం అడయార్-

ఒక కొమ్మ పట్టుకు వెడితే,
పోతాం హైదరాబాద్, ఢిల్లీ ;
వే రొక కొమ్మ పట్టుకు పోతే,
వెళ్ళగలం తిరుపతి !

చెట్టుకింద వెలిగిపోతూ మీరు,
చెరగిపోని దృశ్యం !-

అపూర్వమైన మీ ఉదాహరణ,
అయింది మాకు ఉత్తేజన !

అనుబంధాలకు వశీభూతులు,
అమ్మమ్మగారూ ! మీరు-
అవసరం లేకపోయాయి పేరు ప్రఖ్యాతులు,
అంటిపెట్టుకు వుండిపోయారు :

అనుబంధాలకు అతీతులు
దుర్గమ్మగారు-
ఆలిండియా సంఘజ్యోతులు,
అంటీముట్టకుండా వుండేవారు !

"ఏ పూర్వ పుణ్యమొ,
ఏ యోగ బలమొ ?"
అమ్మమ్మగారూ : మీ పజ్జను—
ఆనాడు నేనూ ఒక ఒజ్జను !
ఆది శిక్షకులు మీ నడవడి
అయింది నాకు ఒరవడి !

ఆంధ్ర మహిళా సభకి
జాలారిష్టపు రోజు లవి—

అందుచేతనేమో సభ మనకి
అత్యంత ప్రియమైంది!
అంతో యింతో జీత
మంటూ ఉండేది నాకు,
'అలవెన్స్' అయినా
ముట్టేదో లేదో మీకు!
పాఠాలు చెప్పుకోవడమే
పరమావధి అనుకున్నాం—
సభ పైకి రావడమే
ప్రతి ఫలం అనుకున్నాం-

తెరమరుగునే ఎప్పుడూ మీరు,
తెరముందుకు వచ్చి ఎరుగరు!
అప్పజెప్పిన కార్య మేదో
గప్‌చిప్‌గా నెరవేర్చేవారు—
సభ కార్యకలాపాలలో
మీరు అంతర్వాణి-
సభ కార్యక్రమాలలో
మీరు 'ఆకాశవాణి'

నిర్విరామ తపస్వివి,
నిజంగా మీరు-

నిష్కామ కర్మయోగిని,
నిశ్చయంగా మీరు !

లేకపోవడ మేమిటి, మీకు
మామూలు సరదాలు?
లేవదీస్తూండేవారు, ఈ
మనుమడితో వివాదాలు !
జ్ఞాపకం లేదూ,
అమ్మమ్మగారూ ;

ఆడ + ఆట - అడ్డాట అంటే,
ఆఁ- అనేవారు!
పా. ప. గారు మీ పక్షం,
ప్రతి పక్షంలో నేను -
అమాయకులైన మిమ్మల్ని
ఏమార్చి అయినా
ఆటలో గెలిచి,
మాట దక్కించుకునే వాణ్ణి !

'ఓహో' అనిపించుకోవాలని,
ఏవేవో వండి పెట్టేవారు -

ఎంతో బావుంది, కాని-అనేవాణ్ణి,
ఎవర్ని చేసుకుంటారో, కాని — అనేవారు:
కాఫీ రుచిలో మాత్రం
మన మిద్దరం ఒకటే-
కాశీమకాములో, మన
కాఫీ ప్రత్యేకం !

ఎప్పుడూ మీరు నాకు వాదోడు,
ఏ మనుకున్నా మీకు నా చేదోడు—
ఎటువంటిది మన ఉజ్జీ
లేదంటే, దానికి ఉద్ది !

పిల్లలచేత రేడియోలో
ప్రోగ్రాం చేయించాలన్నా-
పిన్నలచేత స్టేజిమీద
డ్రామా వేయించాలన్నా-
పేరంటానికి కొత్తఫక్కీని
'పిలుపు' రచించాలన్నా—
'ఆంధ్ర మహిళ' లో మీ అనువాదాలు
అచ్చొత్తించాలన్నా-

మీకు నా చేమోడ్పు,
నాటి మీ వాపోడు—

మరచిపోలేదు, అమ్మమ్మగారూ !
నాకు గురువులుకూడా మీరు—
మరవగలనా ఎన్నటికైనా,
మీరు నా హితైషులు కారా?
ఎందీ చెప్పారు నాకూ,
హితవు మప్పారు నాకూ !

తొలి మనుమడుగా మీతో
నా సాహచర్యం
తొమ్మిదేళ్ల సాగిం
దాశ్చర్యం !

అమ్మమ్మకీ, చాదస్తానికీ
అవినాభావ సంబంధ మంటారు—
అది లేకపోవడంచేత, మీరు
అమ్మమ్మగా రైనారు !

కథలు మీరూ చెప్పేవారు,
కాని 'అమ్మమ్మ' కథలు కావు-

ఉప్పు సత్యాగ్రహం నాటి
ఉద్విగ్న గాధ లవి.
జైలులో ఒకరికొకరు
చేసుకున్న ఉద్బోధ లవి;

సంస్కృత కావ్యాలలోని
స్వారస్యపు బోధ లవి,
బమ్మెరవారి భాగపతంలోవి
భక్తిభావ సుధ లవి !

సౌజన్యమే మీ ఆస్తి,
సాధుశీలమే మీ అంతస్తు !
అత్త మంచి, వేము ల తీపి
ఉండ వంటారు .
ఆమాట అబద్ధం చేసింది మా
అత్త - అంటారు, మీ కోడలు !

అల్లారు ముద్దుగా, మీరు
పెంచుకొచ్చిన మనుమ రాలు
అంది వచ్చించి, హుందాగా,
ఆంధ్ర మహిళాసభకి!

ఆగిపోయిన 'ఆంధ్రమహిళ'
పత్రికను, నా శిష్యురాలు
అందిపుచ్చుకోదా,
అమ్మమ్మగారూ?

భూమంత అరుగు వేసి.
ఆకాశమంత పందిరి వేసి-
సభవారు 'సిల్‌వర్ జూబిలీ'
చేసుకుంటూంటే :
ఆ పందిట్లో మీర్జాపురం రాణీవారూ,
మీరూ పక్కపక్కల కూర్చుండగా చూసి-
ఆహా ఏమి భాగ్య మనుకున్నాను !
ఓహో, చరితార్థు లనుకున్నాను !

ఆంధ్ర మహిళా సభలో
ఒక అశ్వత్థ వృక్షమూ,
అశ్వత్థవృక్షం కింద
ఒక ఉన్నత పీఠమూ,
ఆ పీఠం మీద మీ
కాంశ్య విగ్రహమూ-

అక్కడ ఏ పేటా
మీ ఆరాధనా
ఏర్పాటయితే,
ఎంత బావుంటుంది !

అమ్మమ్మగారూ ! ఇంక మన
అకౌంటు ఫైసలు చేయించండి :
మీ 'బాంక్' లోంచి తీసుకున్నదేగాని, ఎన్నడూ
మీ 'బాంక్'లో నేను వేసుకున్నది లేదు !–
చెమట ఊడ్చి పనిచేసే పత్రికా రచయితని
చెల్లించుకోగలనా మీ ఋణం?

వెలువరిస్తాను నా గీతికలు, నాటికలు
వీలైనప్పుడు చిన్న పుస్తకంగా–
సమర్పిస్తాను నా చిన్ని పొత్తాన్ని,
చల్లని మీ స్మృతికి అంకితంగా:

అచ్చువేయిస్తా రని కాదు, నాకు
వచ్చినవారనీ - నన్ను
మెచ్చినవారనీ- మీ కా రచనలు
చదివిస్తున్నాను, పుచ్చుకోండి !

ఒకప్పుడు మీ 'ఆస్థానకవి' నండీ,
ఒప్పుకోండి- పత్రంపై చెల్లు పెట్టండి!

పెట్టుపోతలకు పేరెన్నికగన్న
అమ్మమ్మగారూ!
ఇవే మీకు నే నివ్వగలిగినవి,
'అక్షర లక్ష' లండి
ఇదిగో, పొదల - ఆశీ
రక్షతలు చల్లండి!

ఎడబాటు ఎడదల వేసిన వ్రేటు
ఎలాగో సంబాళించుకుంటాం,
ఎలుగెత్తి మీ కోసం, మీ
ఆత్మ కపచారం చెయ్యం-

అమరధామం చేరుకుంది,
పవిత్రమైన మీ ఆత్మ...

అందిస్తాం, శుభహారతి -
ఆలపిస్తాం, శాంతిగీతి-

అనుదినం మిమ్మల్ని
స్మరిస్తాం, మీ
అడుగుజాడలే నిత్యం
అనుసరిస్తాం–
అమ్మమ్మగారూ, మే
మిదే ప్రతిన చేస్తాం !

ఓం శాంతిః శాంతిః శాంతిః

22–3–1965

# ప్రశంసా

# గీతికలు

ఆవాహన

ఉజ్జ్వలప్రభ

అక్కడకూడా

జోహారు

అభినందనం

అంజలి

హారతి

# ఆవాహన

దేవతా వందిత మంగళ చరణా!
దేవలోక మోహన వీణాపాణీ॥

పద్మజురాణీ! పరమ పురాణీ!
పరిచర నైగమ తేజస్వినీ॥
వైభవ సదనా! జయ విజయీ!
గాన కల్లోలవతి! తెయ్ దిద్దిత్తెయ్—
కంకణ కింకిణి కిణికిణి,
దేవలోక మోహన వీణాపాణీ!

సుందర సురుచిర మందహాసినీ!
చంద్రకి నటనా చకిత వనీ!
పులకిత జగతీ! తెయ్ దిద్దిత్తెయ్—
విలసిత కీర్తీ! జయ్ జయ్ జయ్!
కంకణ కింకిణి కిణికిణి,
దేవలోక మోహన వీణాపాణీ!

—1940

# ఉజ్జ్వల ప్రభ

ఏమయ్యా, ఆ ఉజ్జ్వల ప్రభ?-
ఎరుగవో, ఆంధ్రమహిళా సభ!
ఒక మధురమూర్తి మానితస్వప్నం.
ఒక మహాశక్తి మానని యత్నం-
మనిషి కాదు - మనుష్యకోటి,
మనికి కాదు - మహత్తరధాటి!
ఎరుగవో, ఆంధ్రమహిళా సభ?
ఎరుగవే, ఆంధ్రమహిళ ప్రభ!

దిగంతముల నేమా శోభ?-
తెలియవా, రజతోత్సవ శోభ!
స్నేహాత్మక జీవిత కావ్యం,
సాంస్కృతిక చ్ఛందో బద్ధం-
సేవామయ కార్యకలాపం,
జీవనసుఖ మార్గదాయకం-

ఎరుగవో, ఆంధ్రమహిళా సభ!
తెలియవో, రజతోత్సవ శోభ!

దక్షిణాది మహిళకు నెలవై,
ఉత్తరాది మహిళకు యిరవై -
భావైక్యత పెరిగిన వ్యవస్థ,
భారతీయ మహిళా సంస్థ!

ఇది యిరువదియైదేండ్ల కథ-
ఎద గగుర్పొడుచు కద!

అరుగో, అరుగో!
అన్నుల మిన్నలు,
ఆటల పాటల
అరవిరి పేటలు —
బృందావన చి
న్నారులు, లీలలు!

వారే, వారే!
వనితా మూర్తులు -
విద్యాసక్తులు,
వికసిత శక్తులు -

ఆంధ్ర మహా సభ
అండను దీప్తులు !

అల్లరుగో,
అధినాయక మహిళలు -
సేవా నిరతలు,
స్థిర సంకల్పలు -
ప్రభవించె, స్వయం
ప్రభ — మహిళాసభ !

ఎద గగుర్పొడుచు కద,
ఇది మహిళా సభ కథ-

వారుగో ! - రాణులు,
వితరణ పాణులు ;
మాన్య, లుదార
వదాన్యులు - వంతులు
పడి సమకూర్చిరి
బవంతులు -

అల్లవిగో, కను
మనె భవనమ్ములు -

విద్యా మందిర
వసతి వాసములు
శిశు విహార మిది,
ప్రసూతి గృహ మది-

కితాబు లడుగని అదృశ్యు లెందరో
మునాబు రోజుల శ్రమ ప్రదాతలు -
ఇక్కడ రా
ళ్లెత్తిన కూలీ,
ఇట పల్లకి మో
సిన బోయీ,
గుండియ నిచ్చట
కొలు వుంచిరి,
ధన్యుల మనుకొని
పనిచేసిరి-

ఇది మహిళాసభ కథ !
ఎద గగుర్పొడుచు కద

చెన్న పట్టణము కాణాచిగ సభ
చెన్ను మీరినది, యిన్నాళ్లూ -
ఆంధ్ర "ఆంధ్రమహిళాసభ"గా నటుం

హైదరాబాదు నందుకొన్నది!
ఇరువది మైదేండ్ల సభ,
ఇది ఉజ్జ్వల ప్రభ!

ఆంధ్రమహిళా మహాసభా!
అసదృశ రజతోత్సవ శోభా!
లసత్పత్రికా లలంతికా, వి
లస త్పత్రికా సుపుత్రికా–
వివర్ధమానా, విరాజమానా –
విస్తృతా, విశ్రుతా –
దుర్నిరీక్ష్యమై తోచు, నేటి నీ
సముజ్జ్వల దివ్య సాక్షాత్కారము!

చకితమ్మైనది
చేతము! హృదయము
సమ్ముగ్ధము, ని
ర్గత మీ గీతము.

–1962

# అక్కడ కూడా -

అవునా, లీలా !
ఆనాటి
అల్లరి పిల్లా—
ఆంధ్ర మహిళాసభ
అరిష్టాలు
నాతోటే తీరాయి,
నీతోపాటు మారాయి.

అవునా, లీలా!
ఈనాటి
ఆంధ్ర మహిళా –
అత్త నాటిన మొక్క
అక్కడ కూడా
పెరిగి పెద్దదయింది,
పెత్తనం నీ దయింది.

హైదరాబాదు లీలా!
ఎంత
ఆరిందా వౌరా —
ఈడుగాని బావని
ఇంకా వున్నానని
ఎంత జ్ఞాపకం నీకు
ఇన్విటేషన్ నాకు!



# జోహారు

ఆదినుండి సభాధ్యక్షపదవి నలంకరించిన స్వర్గీయ మీర్జాపురం రాణీగారికి ఆంధ్ర మహిళాసభ తరపున-

పరమపదించెనా
పావని మనరాణి,
పాలింపకుండునా
ఆమె జీవనసరణి -

శీవికి, యీవికి
దీక్షైన రాణి -
కూర్మికి, పేర్మికి
కుదురైన రాణి -
నిష్ఠకు, నియతికి
నెలవైన రాణి-
పరమపదించెనా
పావని మనరాణి

పాలింపకుండునా
ఆమె జీవన సరణి -

ఆమెతోడి సమావేశము
మన కిచ్చెను
మహదావేశము,
ఆమె దయచేసిన
సన్నివేశము
మనకు కూర్చెను
మహాభినివేశము -
ఆమె సన్నిధానము
మన కయ్యెను
పెన్నిధానము,
ఆమె సందర్శనము
మన కయ్యెను
ఆత్మ శోధనము -
పరమపదించెనా, మన
పట్టపు రాణి -
పాలింపకుండునా, ఆమె
అమృత వాణి -

స్త్రీ జనశ్రేయము

ఆమె
కైనది ధ్యేయము -
ధర్మానుసంధానము
ఆమె
కైనది ధ్యానము -
అతి నిదానము
ఆమె విధానము-
ఆమె పాలనము
మనకు
స్వపరిపాలనము -
ఆమె లాలనము
మనకు
ఆత్మోన్మీలనము-
పరమపదించెనా, మన
పట్టపు రాణి-
పాలింప కుండునా, ఆమె
అమృత వాణి -
అనుగ్రహము వీక్షణముల,
అనుమోదము భాషణముల -
ఉత్సాహము ఎడద యెడద,
ఉద్యమమ్ము విడిది విడిది -

తిరుచూర్ణపు తిలకముతో,
తిరుమణి అర్థేందువుతో -
విమల భక్తిభావముతో,
అమల ధర్మతేజముతో -
వెలుగొందెడి శుభవదనము
వెలిగించెడి స్మృతిపథమ్ము -
మఱుమాయమయ్యేనా ఆమె తేజస్స్ఫురణ,
మనల కాయకుండునా ఆమె దివ్యస్మరణ-

ఆమె కలిగించినది
అధ్యక్ష పదవికి
అమిత గౌరవము -
ఆమె కొని తెచ్చినది
ఆంధ్రమహిళా సభకు
అతిశయ నామము

సన్నుతు లివె, మన
పట్టపు రాణికి,
సన్నుతు లివె
పరమకల్యాణికి !

- 1963

# అభినందనం

రుద్రాక్కరలు :

పదియు తొమ్మిది వసంతాల
ప్రాయంపు నిండు జవరాల!
పొదలాడు పత్రికాజగతి
ప్రోడవై నీ కార్యనియతి –
వదనమ్ములో వినూత్న కళ
వచ్చిందిలే, 'ఆంధ్రమహిళ'!
పదిలముగ కైసేసు కొనవె,
ప్రాలుమాలిక బాసి తనువె –

బాలికాడోలిక నమర్చు,
ప్రౌఢలకు వేదికను కూర్చు –
తూలికా కేళికవు కమ్ము –
తౌర్యత్రి కాంతికవు కమ్ము –
కాలికవు శీర్షికలు నిలుపు,

కలిసివచ్చే కళలు తెలుపు –
కీలకపు సలహాల నిమ్మా,
గృహిణులకు వాదోడు కమ్మా –

ఎదిగితివి చిన్నారి చెలువ
ఎత్తువారల చేతి చలువ –
ఎదగదించితి నే నొకపుడు,
ఎరుగుదువో, లేదో నీ విపుడు –
వదినెలందరు వచ్చినారె,
వలపుహారతి నిచ్చువారె –
చదివింతు నభినందనాల,
సరసంపు మధ్యాక్కరాల!

★

# అంజలి

కీ. శే. పిఠాపురం మహారాజా శ్రీ రావువేంకట
కుమార మహీపతి సూర్యారావుగారికి అశ్రుతర్పణం —

అపరభోజు డస్తమించె,
ఆంధ్రవాణి నిశ్వసించె—
ప్రాతవిలువ లంతరించె,
ప్రజాస్వామ్య మతిశయించె_

లక్షలు కురిపించి, దీన
రక్ష నెరపిన ఘనతరుడు -
పిఠాపురం మహారాజు
పేరు నిలుచు కలకాలము!

బ్రహ్మసమాజము కడపటి
ప్రార్థనముల వినుతించె,
ఆంధ్రమహిళ అంజలించె,
హరిజను డశ్రులు నించె -

కవిపండిత గాయకులకు
గాద్గద్యము క్రమ్ముకొంచె,
విద్యాసంస్థలు విచార
వివశత్వము వెల్లడించె-

బ్రతుకుగన్న అనద, పేద
పట్టుకొమ్మ ప్రస్తుతించె-
ప్రగతిబాట పడిపోయె
ప్రభుత పస్తాయించి చూచె-

మానవసేవా ధర్మము
మప్పిరో, పంతులుగారు-
మాధవసేవా మర్మము
తెల్పిరో నాయుడుగారు!

మదరాసునగల ఆంధ్రుల
మహాసభను, మహిళాసభ
మహారాజ పోషకుడై
మన్నించిన ఉదారుడు -

వితరణమ్ము శోభిల్లగ,
విజ్ఞానము వెదజల్లగ

విద్యామందిర మొకటి సు -
వెలయించెను మహిళా సభ!

స్త్రీజనాభ్యుదయ మెవ్వరి
చింతితార్థ మయ్యె, నట్టి
మహారాణి చిన్నమాంబ
మధురస్మృతి చిహ్నమది!

స్త్రీజన సంక్షేమ మెవరి
జీవిత పథమయ్యె, నట్టి
మహిళామణి దుర్గాంజీ
మధుస్వప్న సిద్ధియది!-

పలుముఖముల సంఘసేవ
వెలయించిన ప్రభువరుడు,
పిఠాపురం మహారాజు
పేరు నిలుచు కలకాలము!

ఆ వితరణి అస్తమయము
అయ్యెనే, విషాదమయము -
అరిగె నెటకు, ఐశ్వర్యము?
ఆదుకొనదె, ఔదార్యము?
మాటత్రుంచ ఆమయము,
కోటపంచ ఆశ్రయము -

అండ నెవరు లేనిది,
దండ కెవరు రానిది -

క్రిందుపడు టెరుంగ డెప్పుడు
ఎందితాత్మ, కుంది కుంది,
స్వర్గమందు వేచియున్న
చిన్నమాంబ చేర నరిగె-

మదరాసున వినిపించును
పిఠాపురం నగరనుచు-
మదరాసున కనిపించును
సూర్యారావ్ రోడ్ అనుచు-

పిఠాపురం బావురుమనె,
'మెయిలు' ముందె ఆగమానె-
వెలుగురేడు మరుగుపడియె,
విద్యుత్ప్రభ శకము చనియె.

# హారతి

పిఠాపురం రాజా శ్రీ ఆర్. వి. యమ్. జి. రామారావుగారి ప్రశంస.

చిననాడు మన భావ
సీమ నేలిన వాడు-
యువరాజు రాజయ్యె,
నోహెూ, నాటికి నేడు-

రాజ్యమ్ము మన మనో
రాజ్యమై మిగిలె బో-
రమ్ము పట్టము గట్ట,
లెమ్ము ఛత్రము బట్ట!

సంపద చెడియు, తెగ
తెంపు విడువడు, తగ
పెంపు సూపెడు, వగ
వంపగల ధీరుడు!

యువరాజు రాజయ్యె,
నుత్సాహ మెద కయ్యె-
ఆకాంక్ష జయపెట్టు,
కవిత హారతి పట్టు!

జనత కోరినవాడు,
జయ రామరాజు!
జనత చేరినవాడు,
జయ రామరాజు!

జనవాణి ఏలెనట
శ్రీరామ రాజ్యము-
జనపాళి ఏలు నిట
మన రామరాజ్యము-

రాజిత పిఠాపురీ
రాజ బిరుదాంక!
ఠీవి మెరయగ దేశ
సేవ చేయగ నేర్తు-

రాఘువంశ పయోధి
రాకా శశాంక!
ఈవి వెలయగ జనుల
కిచ్చి సేమము గూర్తు-

# ప్రణయ గీతికలు

ఆహూతి
దీపకాంతిలో
పూదరి
ఒక కథ
తెరపుమరపు
జంటపాయకుండానే
బాలన్స్–షీట్
ఆశకు విడాకులు
పుడికి తీరాలా ?

# ఆహుతి

విరిసిన తీపులు
విరిగి విషాలై,
విసరని ముద్దులు
విషోరగాలై
విసపు గసటులో,
ముసరు బుసలతో
అరచినవి,
కరచినవి!

ఊపుకు నెత్తుటిని
ఉద్రేకించెడి
కౌగిలికై తెగ
సాగిన నరాలు
పటపట నొక మొగి
పటుక్కుమని తెగి
పోయినవి,
పోయినవి!

కొరికెడి కోరిక
నురికెడి మనస్సు,
ఊపెడి కామము,
ఉబికెడి వయస్సు –
మరుగు ప్రణయమే
మహాప్రళయ మని
పించినది,
ముంచినది!

ఒంటరి జీవము,
తుంటరి కాయము –
తీరని కోరిక,
ఆరని యనలము –
ఎగయక జీవము
ఎముకల గూడు
చిచ్చున మాడినది,
చిటపట లాడినది!

– 1936

# దీపకాంతిలో

దీపకాంతిలో, కటికి
దిగువ, నెవ్వ రా గోష్ఠి?-
నేను, నా నీడ : మే
మిద్దర మిక్కడ, కాని-
దీపం దిగజారి, నిద్ర
దిగు వేళకి నీడా నను
దిగనాడును—అయ్యో, ఎంత
దెసచూలితిని !

(ఇంగ్లీషు నుంచి) - 1939

# పూదరి

వేయి శిరసుల నెత్తి
వాసంతరము ఆడ,
వేయి గొంతుల నొత్తి
విహగలోకము పాడ-
ప్రతిజీవియును మారు,
గతయావనము చేరు;
వయసు పైబడి నేనె
వడలి పోవుదు నోయి!

# ఒక కథ

వెనక ఒకప్పుడు
మిత్రుం డొక్కడు
మక్కువతో నాక
చక్కని మొక్కను
చిన్న బహుమతీ
చేశాడు :

అది నా పెరడున
అటె పడియున్నది;
కాని లోకమున
గల తక్కిన మొ
క్కలవలె పెరుగదు,
గతింప !

ఆవైపు తిరిగి
నపుడెల్ల, అటులె -
చిట్టి చూపుతో,

చిన్న నవ్వుతో
స్నేహంగా చూ
స్తుంది -

ముదరని కొమ్మల
నెదుగని మొగ్గలు :
అవి వికసించవు,
అవి వలపించవు -
చిట్టి చూపుతో,
చిన్న నవ్వుతో.

మొక్కను చూతును,
మిత్రుని తలతును -
మిత్రుని తలతును,
మొక్కను చూతును -
చిట్టి చూపుతో,
చిన్న నవ్వుతో.

# తెరపు మరపు

వెలిసి వెలియని తలపులలో,
పొలసి పొలయని సొలపులలో –
అదరి పాటున నంత
అచ్ఛముగ నీగొంతు
వింటాను, కల్ల కా
దంటాను!

తెలిసి తెలియని తెలివిలో,
మలసి మలయని కలలలో –
సరిగ నిన్నే కరవు
బరువు కన్నుల నరయ
గంటాను, కల్ల కా
దంటాను!

తెలివి తెలిసిన కలలలో,
కలలు మలసిన తెలివిలో –
కలిసి నాతో యిచ్చ
కము లెన్నొ నీ వాడు

తుంటావు, కళ్ల కా
దంటాను!

తెలివి చాయల బయలలో,
కలల మాయల హాయలలో —
ఇరువురము ఎచటికో,
ఎచటికో ఎగిరిపో
తుంటాము, కళ్ల కా
దంటాను!

తెలివొచ్చి, కనువిచ్చి
కల జీవితము సొచ్చి —
విడి దూరమైన మన
విధమునే కిసవచ్చి
గుండె లవియగ నేడ్చు
చుందును — సఖా!

-1940

# జంట పాయకుండానే

వయసు మళ్ల కుండానే
వార్ధక్యం వచ్చెనా -
బ్రతుకు చూడ కుండానే
బలమంతా వుడిగెనా -
జంట పాయ కుండానే
ఒంటరితన మయ్యెనా!

- 1946

# బాలన్స్ - షీట్

కలలు కలలు కలలు...
కలలె బ్రతుకుగా గడిపానోయ్!
బ్రతుకు బ్రతుకు బ్రతుకు...
బ్రతుకె కలలుగా నడిపానోయ్!

కలలు కట్టిపోయాయోయ్,
బ్రతుకు వట్టి పోయిందోయ్ -
కన్నీరే, కాయకష్టమే
కడకు నాకు మిగిలిందోయ్!

# ఆశక్తం విడాకులు

అయితే, హృదయేశ్వరి, నీ
అభిమత మిది కనక -
ఇన్నాళ్లకి నాగతి యిం
తేయని తెలిసెను కనక -

కొలిచిన నా ప్రేమంతా
కొరగానిది అయితేనేం!
తలచిన నా బ్రతుకంతా
తలక్రిందులు అయితేనేం!-

ఇది యిట్టులు కావలె నని
విధి వ్రాసెను కనక,
విధి వ్రాసిన చొప్పున నెర
వేరక తప్పదు కనక -

కొదవలేని గర్వంతో
హృదయము ఉప్పొంగును -

కృతజ్ఞతా భావంతో
కీర్తింపగ నీ నాట్యం!

నీ కల్పించిన ఆశని
నీవె తిరిగి తీసికో,
దాని జ్ఞాపకం కంటే
నే నెక్కువ అడగను!

-1947

# పుడికి తీరాలా?

ఎటు గులాబీని మ
న్నింప వలె నందువా?
కోయ కటులే విడిచి
వేయ మంటాను!
మురిసి ముక్కున రాచి,
వలచి ముద్దుల నేచి -
కరకు మెయి కయిచేసి,
కడముట్టగా రోసి -
కడకు గిరవేయగా
పుడికి తీరాలా?
ఎటు గులాబీని మ
న్నింప వలె నందువా?-
కోర కటులే విడిచి,
ఊరుకో మంటాను -
కడకు గిరవేయగా
పుడుకవల దంటాను!

-1945

# ప్రకీర్ణములు

కొత్త పెళ్ళికూతురు
పెట్టు శుభపాదం
భయభ్రాంతుడు
లా-కౌట్
అవకుంఠనం తొలగింది
యజ్ఞవాటి
మళ్ళీ శపథం
కెన్నడీ హననం
మాయూరము
చూస్తో నిలబడ్డానికి
కృష్ణశాస్త్రి మౌనము

# కొత్త పెళ్లికూతురు

ఆగు,
అలా ఆగు -
ఆయనపేరు చెప్పండే
అడుగు వేస్తా వెకడికి?
అరమోడ్పు కన్నులతో
ఆరాతీస్తా వేమిటి? -
వంగనాచి,
వంగముల్లు!

ఆగమంటే
ఆగవేం -
అవనతవదనం చాటున
అంత ఉక్కు దేనికి?
అందాల బరిణెకి
అంత ముక్కు దేనికి? -

నంగనాచి,
వంగముల్లు!
ఆగవోయ్,
ఆగు –
చెక్కిళ్ళ గులాబీలు
పూస్తున్నా వెందుకు?
పెదవుల చిరునవ్వులు
తోస్తున్నా వెందుకు? –
నంగనాచి,
వంగముల్లు !

మనలో
మనమాట –
ఆ వంచిన తల లోపల
ఆలోచన లేమిటి?
ఉబికియాడు హృదిలోపల
ఉబలాటా లేమిటి?
నంగనాచి
వంగముల్లు!

సరి,
సరి –

మెలకువలోనే కలా,
మేనంతా పులకలా?
మే మంటే అలుసా,
మే మెవరో తెలుసా?
నంగనాచి,
వంగముల్లు!
అయితే,
మరి –
నోరు విప్పు, మీ
ఆయన
పేరు చెప్పు –
వాడ అంతా
గప్ చిప్పు!

– 1968

# పెట్టుం శుభపాదం

పెట్టు పాదం
పెట్టు -
మా యింటి
మహాలక్ష్మి!

పెట్టు శుభ పాదం -
మంజీరము మ్రోయ,
మట్టెలు లయవేయ -

పెట్టు శుభ పాదం -
లత్తుకపూత మెరయ,
లాలిత్యము తెలియ -

పెట్టు శుభ పాదం -
కుచ్చెళ్ళు జీరాడ,
కుంకుమ్మ తారాడ -

పెట్టు పాదం
వదినా, పంచి
పెట్టు మోదం –
పొరపులు దులిపించు
పొత్తులు హత్తించు –
మనసులు వెలిగించు
మనుషుల మనిపించు !
పెట్టు పాదం
వదినా, పంచి
పెట్టు ప్రమోదం –
ఈసులు పెరికించు,
ఇష్టం మొలిపించు –
ఎడదలు నిండించు,
ఎలమిని పండించు !
పెట్టు పాదం
వదినా, చూ
పెట్టు నీ ప్రభ !
ఉవ్విళ్లూరుతున్న
హృదయవల్లభునితో
చేపట్టు గార్హస్థ్యం,
చెలాయించు పెత్తనం –

పెటు పాదం
వదినా, చూ
పెట్టు నీ ప్రజ్ఞ !
ఆశలు పెట్టుకున్న
అత్తమామలకు
ఇప్పించు వానప్రస్థం,
ఇంటిలోనే ఒకపంచ -
పెట్టు పాదం
వదినా, చూ
పెట్టు నీ వస :
వీరు ఆడపడుచులు,
కారు కోడిపుంజులు -
కాసుకో దూకుళ్ళు,
వేసుకో బుట్టలో -
వదినమ్మా, మ
రదినమ్మా, ల
క్ష్మణు డనుకోమ్మా,
మచ్చికయిమ్మా !
పెట్టు శుభపాదం, సరి
పెట్టు మా వివాదం -

తప్పటడుగుల
చొప్పు కనక,
తొక్కు పలుకులు
చెవిని పడక -
ముద్దు తీరక,
పొద్దు పోవక
పెనగులాట
పెద్ద లింట !

పెట్టు శుభ పాదం, కని
పెట్టు మాకు వినోదం -
చిట్టిపాపలు కలగాలి,
చీదర వై తొలగాలి-
సందడి దండడించాలి,
డెందము లానందించాలి !
పిల్ల లింట తిరగాలి,
పేచీలతో పెరగాలి -
అమ్మను వేధించాలి,
అయ్యను సాధించాలి !
చిరుతలు గడితేరాలి,
చిలిపితనం నేర్వాలి -

అవ్వను కవ్వించాలి,
తాతను నవ్వించాలి !

పెట్టు పాదం.

పెట్టు-

మాయింటి

మహాలక్ష్మి !

పెట్టు శుభపాదం.

# భయ భ్రాంతుడు

సిగరెట్టు పీల్చడం మానుకున్నాను,
సిగారు కాల్చడం పూనుకున్నాను -
చుట్ట అను, సుర టను, పోనీ
చెరూ టనుకోనీ -
ఏమను కుంటే ఏమిలే,
ఏముందిలే పేరులో!
ఘాటు చాలక కాదు,
ఆటిరాక అసలేకాదు -
కాన్సరుపుండు బ్రహ్మ రాతనీ,
కాన్సరుకు ఆన్సరులేదని-
సిగరెట్టు కొంప ముంచుతుంది,
సిగారు కొంత నయమనీ -
యోచన చేశాను,
పాచిక వేశాను -
అబ్బే!

ప్రాణమంటే తీపిలేదు,
మరణమంటే భీతిలేదు –
హార్దికం, ఈ ఆరాటం –
ఆర్థికం ఈ పోరాటం –
ఒంటిగాణ్ణి కాను,
వృయార్ సెవెను –
మనది శ్రేయోరాజ్య
మెప్పటికి కాను?
రెక్కాడక
డొక్కాడదు –
ఊరుకుండి, ఊరుకుండి
పెట్టుకున్నాను ఉరి –
ఉండివుండి, ఉండివుండి
పుట్టుకొచ్చారు మరి-
వాళ్ళకి రెక్కలు రా
వద్దా, పక్కల
వాళ్ళకి నే కా
వద్దా ?
ఆలోచన
ఆవేదన –
రోజులు మారిన
మందభాగ్యణ్ణి,

పోజులు మిగిలిన
మానవంతుణ్ణి,
మధ్య తరగతి
బుద్ధి మంతుణ్ణి -
మనో నేత్రం వికసిస్తుంది,
మళ్ళీ యిలా అనిపిస్తుంది:
వాళ్లు మనం లేకపోతే
ఏమై పోతారో అనుకోడం
వట్టి భ్రమ,
వాళ్ళకి మన మేదో
చెయ్యగలం అనుకోడం
వెర్రి భ్రాంతి -
వివేచన,
విమోచన -
సిగారు పీలుస్తున్నాను,
సిగరెట్టు లాగ -
సిగరెట్టు కాలుస్తున్నాను,
సిగారు లాగ -
భయం మూలబడి,
భ్రాంతి తిరగబడి.

-1962

# లాకౌట్

నిర్వాసితుణ్ణి నేతా,
నెలవు కల్పించు త్రాతా !
మదుపుచెడ్డ వ్యాపారం
మధ్యతరం సంసారం-
'సమ్మె' కట్ట సంభారం,
సద్మశ్రీ అనె 'లాకౌట్' -
సదనంలో రూలింగ్ పార్టీ
సంతానం మూక మెజార్టీ -
సంసార విధాన సభనుంచి
సరదాలు 'వాకౌట్' -
బుర్రతోటి 'బాక్సింగు బౌట్'
బుద్ధి తింది 'నాకౌట్'-
వార్తా పత్రికలందు, ఈ
వార్త లెందుకో 'బ్లాకౌట్'!
నిర్వాసితుణ్ణి
నేతా !

తలక్రిందుల పక్షిని
తండ్రీ!
తిరగేసిన కుక్షిని
దేవా!
మనోభాండారం
మండబెట్టాను -
గుండె గడియారం, ప
రుండ పెట్టాను -
బ్రతుకు బండారం
ఎండలో పడేశాను-
తలప్రాణం
తోకకు వచ్చింది,
పరకాయంలో వున్నట్టు
తన్నుకొంటున్నాను-
బోల్తాకొట్టింది
జీవితం బస్సు-
తలక్రిందుల పక్షిని
తండ్రీ!
త్రిశంకు మహారాజును నేనె,
సిటిజ నాఫ్ది స్పేసును కానె -

రోదసి మదీయ గేహం,
ఈథరు అస్మదీయ దేహం-
విద్రుపలైంది వ్యామోహం,
చిద్రుపలైంది సమ్మోహం -
సోహం, శి
వోహం, శి
వోహం, శి
వోహం -
త్రిశంకు మహారాజును
నేనె!

మధ్య తరగతి మానవుడికి,
అవధ్యుడికి, అనవద్యుడికి
ఇది
ఉద్యాపన.



# అవకుంఠనం తొలగింది

మహోద్ధతుడైన
కీచకుని మాద్రి
కవియ వచ్చింది
మావోచైనా ...

అవకుంఠనం
జారిపడింది –
భారతమాత శాంత
గంభీర వదనం
బయలు పడింది,
శత్రుభయదమై –

సమైక్య భారతజాతి
సత్వం ప్రతిబింబిస్తూ,
చెక్కుచెదరని నిబ్బరంతో
కృతనిశ్చయం ప్రకటిస్తూ –
భారతమాత శాంత

గంభీర వదనం
బయలు పడింది,
శత్రుభయదమై –
చిరార్చితమైన
శ్రీవదనం,
పురాణభారత
పుణ్యవదనం –
తారుణ్యము
తరుగనిది,
తారళ్యము
తొరగనిది –
భారతమాత
భవ్యవదనం
ప్రదీప్తమైంది,
దివ్యదృశ్యమై –
వేనవేలు
వదనములై
విశ్వరూపం
తాల్చింది,
భావైక్యత
ప్రస్ఫుటమై

భీమబలం
వెలార్చింది!

జవహార్ రాజర్షి
హృదయం పులకించింది,
'జై హింద్' విరావం
మిన్ను ముట్టింది -

స్వాతంత్ర్య ఉద్యమ
దీక్షలో
సాక్షాత్కరించింది
తనకు దేవి నాడు -
సరిహద్దు ఉపద్రవ
పరీక్షలో
సందర్శన మిచ్చింది
తిరిగి నేడు !

జవహార్ రాజర్షి
హృదయం పులకించింది,
'జై హింద్' విరావం
మిన్ను ముట్టింది -

శ్లాఘించాడు మన
సమర నేత
చైనా దగు యీ
'మేలు' సేత !

- 1963



# యజ్ఞవాటి

రుద్రాక్ష—రలు :

అభివృద్ధి సాగేటి నేల
అయినది మహాయజ్ఞశాల -
సౌభాగ్యసిద్ధి పతకాలు
సర్వధా నేటి యాగాలు -
శుభయోగమును చెరుపగోరి,
సౌహృదపు హద్దులను మీరి
సభకూడె నుత్తరపు కోన
చైనాసురుని కుటిలసేన:
ఖ్యాత భారత మూర్తి మాప
కత లల్లె నచ్చెరువు తోప -
నీతి నియమా లుజ్జగించె,
ఘాతుకమునకె యిచ్చగించె -
కైతవము తెల్లమగు సరికి,

కినిసి నేస్త్రము మీాది కురికి -
జాతికట్టుకు పిలుపు తేది
చేసె నక్టోబరు యిరువది -

శ్వేత గిరిపై నెత్రు చాలు
విశ్వ మిత్రునికే సవాలు -
వితాకున దేశ దేశాలు
వేసుకొనె ముక్కుపై వ్రేలు -
పోతరించిన యుద్ధవాది,
రోత గొలుపు జగద్విరోధి -
భీతిలేని వితండవాది,
బెడియు నెప్పుడో పిని వ్యాధి!

సంఘటిత జాతి యని చాటు,
చెడుబుద్ధి కది చెప్పు వ్రేటు -
లొంగుబా టెరుగదని చాటు,
దొంగ పోటుకు భంగ పాటు -
సింగంపు కొదమలని చాటు,
సీమాంతములు వేగ దాటు -
సంగాత మెక్కుడని చాటు,
సంగరమ్మగు సిగ్గుచేటు-

చేర్పు పడమరగాను చేకోడు,
ఊర్పు సేచ్ఛ మనకే రాదు -
తూర్పు మన కయ్యో వాదోడు,
తురుష్టు సమాజీవనము నేడు -
తీర్పు చెప్పంగ పృఋళోడు
తాటస్థ్యమును మనకె శ్రోడు-
ఓర్పు మన కుంటె సైదోడు,
ఉద్ధతుం డెటుల తానోడు -

ఆసేతు శీతనగ ధాత్రి
అవును సస్యసుషమ సుగత్రి -
ఆసేతు శీశనగ ధాత్రి
అవును విద్యున్మయ సునేత్రి -
ఆసేతు శీతనగ ధాత్రి
అవును తప్పక సౌఖ్యదాత్రి -
ఆసేతు శీతనగ ధాత్రి
అవని నిల్పును సౌమ్యమైత్రి !

# మళ్ళీ శపథం

జయ జయా !
ప్రియభారత
జనయిత్రీ,
దివ్యధాత్రి !
నీ చేతిలో చెయ్యి
వేస్తున్నా,
నేను తిరిగి బాస
చేస్తున్నా :
నిలబెడతా
నీ జెండా దర్పం,
నిలుపుతా
నీ నిండు గర్వం—
పోరు ఎంత
గడ్డు దయినా,

పోరు వండ్లు
ఫ్రాండ్లు పట్టినా;
చేస్తా
ప్రాణమే పణం
చెల్లిస్తా
మాతృ ఋణం!

నీ చేతిలో చెయ్యి
వేస్తున్నా,
నేను తిరిగి బాస
చేస్తున్నా :
పట్టుదలతో
పాటుబడతా
నా జాతిని
పటిష్ఠం చెయ్యడానికి,
నా దేశాన్ని
బలిష్ఠం చెయ్యడానికి –
జై హింద్ !

# కెన్నడీ హననం

జగతి కేమి కానున్నది?
ప్రగతి ఎట్లు పోనున్నది? -
అధ్యక్షుడు కెన్నడీ,
అయ్యయ్యో, నేల కొరగ -
పాషండు డెవండో
గురిపెట్ట తుపాకి గుండు:
సుకృత మన్నదే లేదో?
సుగతి ఉన్నదో, లేదో?
స్వేచ్ఛ పొల్చు ధాత్రీ
వలయానికె అధ్యక్షుడు,
అయ్యయ్యో, నేల కొరగ -
శాంతి కోల్చు ధ్వజినీ
నిచయానికె అధ్యక్షుడు,
అన్నన్నా, నేల కొరగ -

అఖిల దేశ జన వంద్యుడె,
అయ్యయ్యో, నేల కొరిగె-

హృదయము వ్రయ్యలగు,
దుఃఖము పొంగి పొరలు -
గొల్లు మనెనట జాక్విలైన్
వల్లభుశిర మొడి నిడుకొని -
దద్దరిలెను శాంతిగువ్వ,
తాకెపోలు గుండురవ్వ-
ప్రాణస్పద్దది సర్వాంసహా,
మంటి కొరగ మహాశయుడు-
ఖిన్నమయ్యె మానవాళి,
కన్నుమూయ మహోద్యముడు -
దండి మగని కోల్పడి, కల
గుండువడె నమెరికా ప్రజ -

దాన శూర వీర 'కర్ణు'
డయ్యో, ఇక లేవబోడు -
ఆర్తిహరుడు, అరిందముడు
అయ్యయ్యో, ఇంక లేడు -
మేరు సమాన ధీరు
డారా, మరి కానరాడు :

మధ్యందిన మార్తాండుడై
అస్తంగతుడై చనె -
జగతి కేమి కానున్నది?
ప్రగతి ఎట్లు పోనున్నది?
సుకృత మన్నదే లేదో!
సుగతి ఉన్నదో, లేదో!

# మయూరము

- మత్తమయూరం -

శ్రీశర్వాణీనందను శ్రీవాహన మీవే,
శ్రీశౌరిశ్రీమౌళికి శృంగారమ వీవే,
శ్రీశాహంశాహీ వరసింహాసన మీవే,
శ్రీశుంభజ్జాతీయ విశిష్టద్విజ మీవే !

వనవిహారణ భవ్య విలాసమవే,
ఘన పరివృత శృంగ విలోకనవే,
అనుపమ నవహర్మ్య వినోదమవే,
తనుఘనగతి మత్తమయూరమవే!

- నృత్తం -

నట్టువ పులుగు, హాూం
బట్టు జిలుగు;
వట్రువ వెలుగు, పురి

కట్టు బెడగు;
చిక్కని మిసిమి, నును
రెక్క పసిమి;
చొక్కపు సొరు, కొన
ముక్కు తీరు–
వన్నెల హొరంగు,
వనరమ తెరంగు !
　　– నిగన్నిగలు,
　　– ధగద్ధగలు . . .

–వనమయూరం–

మేకొనగ విభ్రమము మేఘముల జూడన్,
పైకొనగ విభ్రమము పన్నగము లోడన్,
వేకొనగ పింఛమున వేగనుల జాడన్,
నాకపతి కోర్కులిడె నమ్మి కొనియాడన్ !

-మయూరసారి–

ఆకసాన మబ్బు లాడ గన్నన్,
కేక లాశ లంటు క్రీడ లెన్నన్;
నీకు కేకిపేరు నీత మన్నన్,
మాకు పడ్డ మద్ది మాన్య మెన్నన్!

# చూస్తో నిలబడ్డానికి

చూస్తో నిలబడ్డానికి
    తీరిక లేకుండగ –
తోడతొక్కుడు తొందరలో
    ఈ బతు కేంపండగ?

ప్రాలుమాలి చెట్లనీడ
పసరంవలె తేరిపార
చూస్తో నిలబడ్డానికి
    తీరిక లేకుండగ –

దోరదోర చిలకొట్లు
ఏరి తీసుకొని తింటూ
తోటల పడి పోడానికి
    తీరిక లేకుండగ –

పట్టపగటి తారకలై
పయనించే సెలయేళ్లను

# చూస్తూ నిలబడ్డానికి

చూస్తూ నిలబడ్డానికి
తీరిక లేకుండగ –
కొండకొక్కుడు కొందరకో
ఈ బతుకు కేం పండగ?

ప్రాలుమాలి చెట్లనీడ
పసగంవలె తేరిపార
చూస్తూ నిలబడ్డానికి
తీరిక లేకుండగ –

దోరదోర చిలక్కొట్లు
ఏరి తీసుకొని తింటూ
తోటల పడి పోడానికి
తీరిక లేకుండగ –

పట్టపగటి తారకలై
పయనించే సెలయేళ్లను

పనికట్టుకు చూడ్డానికి
తీరిక లేకుండగ -

చూస్తూ నిలబడ్డానికి
తీరిక లేకుండగ -

తొడతొక్కుడు తొందర, ఈ
బతుకు శుష్కవండగ!

(ఇంగ్లీషు నుంచి) - 1946

మ్రోగుతూనే వుంది,
మోహానపు నీ గొంతు -
మ్రోగుతూనే వుంది,
కడలు పులకింప!

నీ పద్యపఠనమ్ము
'నాగరాజు'న మిగిలె,
నీ ప్రసంగవిధమ్ము
'నళిని' లో తగిలె!

★

బిడియమ్ముచే నెపుడు
పిరుతివియు నన్ను
పేర్కొన్నదే పెద్ద
భాగ్య మనుకొంటి -

కవితా సరస్వతిని
కవి బ్రహ్మ వీవు
కల్యాణ మగువేళ
కనులార గాంచి,
ఏ వారనో నిలిచి
కైవార మనగ

ఏగుదెంచితి నయ్య,
ఎద వేగిరింప -

ప్రియమైన వారల
పిరుదనే కలను -
పెరవాడ గానయ్య,
ప్రేమ గనుమయ్య !

మగనాలి కాదని
మాయయ్య వరసని
నామయ్యదే యని
మన్నింతు నయ్య !

## నాటికల నుండి

రేవెలుగు
బుద్ధదంత కథనం
రాధ
ఉగాది పాటలు
బలిదానం
శిలాదేవత

# రే వె లు గు

- సముద్ర కన్యలు -

చిన్నరి పొన్నరి చెలువము వాడే,
చెలి రేవెలదుక చక్కికి రాడే!
చల్లని చూపుల సరసమువాడే,
చెలి రేవెలదుక చక్కికి రాడే!

తియ్యని తియ్యని నెయ్యము వాడే,
చెలి రేవెలదుక చక్కికి రాడే!
చెలి రేవెలదుక చేసినదేమో,
చెలువుడు చంద్రుడు చేరగ రాడే!

శ ర్వ రి :

క్రొత్త ఆశల కోతలో,
క్రొత్త తలపుల మోతలో
తూర్పు గుహాలను విడిచి,
తూర్పు కోనల గడచి -

పరువు పరువున వచ్చి
పడుదు పాల్కడలికి !

నిస్తేజ నీరవము, నిత్య
శూన్య మ్మాకసమ్ము –
కోటి కన్నులు విప్పినా
కనలేకపోయె నిన్ను,
కోటి వలపులు గుప్పినా
కానరాకపోయె నిన్ను !

క్రొత్త ఆశల కోతలో,
క్రొత్త తలపుల మోతలో
పరువు పరువున వచ్చి
పడుదు పాల్కడలికి –
పాతగోడునె విలా
పింతు నాఖరికి !

సముద్ర కన్యలు:

సుందర చంద్రావిర్భావములో,
శుభ్రజ్యోత్స్నా విభ్రమమ్ములో –
పకృతి సమస్తము
పరవశ మయ్యె –

ముఁగుప తమస్విని
మూర్ఛిత యమ్యో-
జలధులు చెలగ,
జగములు వెలిగ -
విధుర నిశీధిని
వ్యథలును తొలఁగ -
ప్రకృతి హృదయమున
ప్రణయము నిండె,
పడతి విభావరి
భాగ్యము పండె!

చందురుడే, చెలి,
సుందరుడే -
సుందరుడే, మన
చందురుడే !
వన్నెల చిన్నెల
వెన్నెలవాడే,
విందుల చిందుల
వెన్నల కూడే !
చక్కని చుక్కల
మక్కువ కాడే,

కాంతుల కలువల
కాచెడు ప్రోడే!
వలపుల దోగిన
వారల తోడే,
నీతులు లోగిన
కేతిరి కేడే!

1941

# బుద్ధదంత కథనం

శ్రీదంతోదంతము
చిరస్మరణ పాత్రము,
చిత్రకథా కలితము, ప
విత్రభావ మహితము!

ప్రఖ్యాత కళింగోత్కళ
రాజధాని దంతపురము,
దంతపుర శ్రీదంతము
దయోదార మత్యంతము-

దంతపుర శ్రీదంతము
దయబడసిన స్త్రీరత్నము
ప్రణుత భక్తిభావోజ్జ్వల
రాజపుత్రి హేమాచల-

మహానీయము శ్రీదంతము,
మహిమాఢ్యము శుభదంతము !

బహుభంగుల యత్నించియు
భగ్నపరుపలేక తన్ను,
చకితుడైన చక్రవర్తి
చేసెను బుద్ధానువర్తి !

బలిమిజూపి శుభదంతము
బడయగందు ననుపంతము
బలిగొన్నది కేడొక్కని
ప్రాణమ్మునె ఆజిని-

ఈతని సోదరపుత్రులు,
ఇంకను వారల మిత్రులు
కాంక్షించిరి శ్రీదంతము
కావలెనని తమ సొంతము :

అంతవార లెత్తివచ్చి,
దంతిపురికి ముప్పు దెచ్చి -
కల్పించిరి కారణంబు
కదలిపోవ సుదంతంబు -

*

తామ్రలిప్తిలో ఓడ కదలెను,
ఓడపైని శ్రీదంత మలరెను!

దివ్యగంగ జేపెట్టినది,
దిక్తటమ్ము మార్మ్రోసినది –
ఆకసమ్ము స్వాగత మనెను,
అంభోనిధి సాగిల పడెను –

ఓడ ముందునకు సాగినది,
ఓడ మోదమున ఊగినది –
పవనమ్ములు బాసట నిలిచె,
పవలు రేలు వేసట దీర్చె!

★

బుద్ధదంత కథనము ...
బౌద్ధశ్రీ ప్రస్థానము ...

భవితవ్యము తా నెరిగి,
బలోద్ధతుల కను మొరగి –
రాకుమారి వేణి డాగి,
నౌకా యానమున సాగి –

పుట్టినిల్లు విడిచి పెట్టి,
పట్టుకొమ్మ జాడపట్టి
సింహళమును శ్రీదంతము
చేరిన వృత్తాంతము –

చిత్రకథా కలితము, ప
విత్రభావ మహితము-
శ్రీదంతోదంతము
చిరస్మరణ పాత్రము !

- 1961

# రా ధ

పాయని తీయని బాధను,
ప్రణయ పిపాసిత రాధను!

వనమాలి పైనె బాళి,
వల్లమాలిన విరాళి!
పాయలేను ప్రాణవిభుని,
పట్టలేను పరమపురుషుని -

వలపు ఎడద వేగిరించును,
వల్లభుని వెనుక బంచును-
మాధవ లీలల గాథను,
మధుర ఉపాసిక రాధను!

★

వలపించు లే వానివంతు,
వలవంతలే వనిత వంతు!

చీరినట్టే చీరి,
చేరినట్టే చేరి -
పారిపోయే చిత్త
చోరుడే శౌరి !

అలముకొన్న కొలంది
అందరాడు మురారి ...

★

రాధిక ఎవ్వరి కెరుక ?
మాధవ దేవునికె కాక —
మాధవు డెవ్వరి కెరుక ?
రాధా రమణికె కాక —

రాధామాధవుల జంట
రసమయ జీవనపు పంట!
రక్తి హెచ్చు రాగమంట,
ముక్తి నిచ్చి బ్రోచునంట -
భక్తి ప్రణయమై పొరలిన
భాగ్యరాశి కద రాధిక!
ప్రణయ మూర్తియై వరలిన
భగవంతుడె కద యేలిక !

## ఉగాది పాటలు

వచ్చె వచ్చె వచ్చె నోహో
ఇంకొక్క ఉగాది
విచ్చె విచ్చె వింత కనులు
పశు పక్ష్యాది
కలకల మని మేల్కొలుపులు
కడల పర్వగన్
బలబల మని తెల్లవారె
ప్రకృతి యంతటన్॥

మింటను తొలిప్రొద్దు నేడు
మిలమిల మెరసె
తరువుల చివురుల పువ్వుల
తళతళ లెగసె
నవజీవము, యువతేజము
నాట్యము చేసె
ఉల్లాసము, ఉత్సాహము
ఎల్లెడ నోలసె॥

గడప గడప కై సేతల
కలకల లాడె
పసుపు పూతపై కుంకుమ
పట్టియ లొప్పె
రంగవల్లికలు ముంగిట
చెంగలించెను
ద్వారమ్ముల తోరణములు
వ్రేలియాడెను

★

కుహూ కుహూ యను కోయిలగ
కొసరి మించు - ఇది ఉగాదిగా !
ఝంఝం దిమ్మను తుమ్మెదగ
రొదాళించు - ఇది ఉగాదిగా!
చల్ల చల్లగ, పిల్ల తెమ్మెరగ
చొకళించు - ఇది ఉగాదిగా!
కమ్మ కమ్మగ, క్రొన్విరి తావిగ
గుబాళించు - ఇది ఉగాదిగా !
పచ్చపచ్చగ, ప్రకృతి శోభగ
పలకరించు - ఇది ఉగాదిగా!

చేదు చేదుగ, తియ్యతియ్యగ
చవులు నించు - ఇది ఉగాదిగా!
క్రొత్త క్రొత్త పతకాల కోవగ
కోర్కె పెంచు - ఇది ఉగాదిగా!
క్రొత్త వెలుగుగ, క్రొత్త వేడుకగ
గోచరించు - ఇది ఉగాదిగా!

★

పచ్చడీ, పచ్చడీ-
ఉగాది పచ్చడీ!
ఊరించే పచ్చడీ,
ఉగాది పచ్చడీ!
ఏటేటా వచ్చేది
ఆమనిదొర యిచ్చేది
ఎనలేని పచ్చడీ!
ఉగాది పచ్చడీ!
మధురజీవి విచ్చేది
మధురమైన పచ్చడీ!
ఊరించే పచ్చడీ,
ఉగాది పచ్చడీ!
క్రొత్త బెల్లమును కలిపిన
క్రొత్త చింతపండు రసము-

వేపపూవు, మావిపిందె
లావళముగ వేసినాము –
చెరకు ముక్క, లరటి పండు
చేర్చి గుజ్జు చేసి నాము –
గుజ్జు నారగింప రండు,
క్రొత్తయేడు మొదలు లెండు !

నవత చేర్చెడి, మానవత తీర్చెడి ...
రసము కూర్చెడి, నీరసము నార్చెడి...
అంద మిచ్చెడి, ఆనంద మిచ్చెడి...
రాగ మెచ్చెడి, అనురాగ మెచ్చెడి...

*

గడిచింది – ఉగాది,
ఇష్టపూర్తి అగునని, రం
జిల్లగ యిల్లాది ॥

ఇంటింటను తెలుగునేల
ఇబ్బందులు తీరగ, తొలి
పబ్బముగా, నిండుగా–
నవవేషము నవధరించి
నడువనున్న యేడాదికి
నాందీ ప్రస్తావనగా ॥

ఏటికేడు వెదుగనెంచు
ఆశామయ జీవనాని
కందమైన భావనగా -
క్రొత్త పూత సంతరించి,
క్రొత్త ఫలము లందించే
ప్రకృతిమాత దీవనగా ॥

చేదు పొదపి, తీపి మెదిపి
సంవత్సర జీవితాన్ని
చవిచూపే సందడిగా -
పంచాంగ శ్రవణముతో
భావిజీవిత క్రమమును
భావించే పండువుగా ॥

# బలిదానం

మన దేశం స్వా
తంత్ర్యం కోసం
తొలిసారిగ జరి
గిన పోరాటం
సాయుధ సైనిక
మహా విప్లవం,
ఝాన్సీ రాణీ
చండ విక్రమం -
స్వధర్మ రక్ష,
స్వదేశ దీక్ష
చేయించిన
సంగ్రామం,
సాహసంపు
బలిదానం!

జయ జయ కృపాణ పాణీ,
జయ జయ ఝాన్సీ రాణీ!
ధిక్కృత శత్రుప్రాణీ,
దేశధర్మ రక్షామణీ!
ఆశా వాణీ,
అపరభవానీ!
జయ జయ ఝాన్సీ రాణీ,
జయ జయ కృపాణపాణీ!

# శిలా దేవత

ఊరి బయట, దారిపక్క
ఎవరికోరి యీ డొంకల
ఎలిశావా నాకోసం-
శిలాదేవతా, దణ్ణం!

ఏ లోకం యిడిసొచ్చావ్?
ఏ దేవతవో కందా!
గొడ్లకాపరికి దొరికావ్,
దొడ్డబాగ్గమే కందా!

ఉంటాలే నీకు జోడు,
ఒంటరి ననుకోకుండా-
ఉంటావా నాకు తోడు,
ఉపదరవం రాకుండా?

- 1957

# పిల్లల గీతికలు

ఆటవిడుపు రేడియో
ఆగస్టు పదిహేను
సరిహద్దున గస్తీ
క్రోధి ఉగాది
మామిడిపిందె మజా
పాపల పండుగ
నెహ్రూ జ్ఞాపకాలు
పక్షి – మనిషి
చెట్టు

# ఆటవిడుపు రేడియో

హాయి, హాయి రేడియో!
ఆట విడుపు రేడియో -
పాడుతుంది రేడియో,
కేరుతుంది రేడియో -
పలుకుతుంది రేడియో,
కులుకుతుంది రేడియో -
హాయి, హాయి రేడియో -
ఆటవిడుపు రేడియో!

అక్కయ్యా, అన్నయ్యా
నడిపించే రేడియో -
అప్పుడపుడు తాతయ్యా
వినిపించే రేడియో -
ఆటవిడుపు రేడియో,
అలరించే రేడియో!
పిల్లలనీ పెద్దలనీ
అలరించే రేడియో!

హాయి, హాయి రేడియో -
ఆటవిడుపు రేడియో !
అలరించే రేడియో,
ఆలిండ్యా రేడియో!
వేడుకో వేడుక,
వేడుకో వేడుక !
పిల్లలకీ పెద్దలకీ
వేడుకో వేడుక!

# ఆగస్టు పదిహేను

ఇదె వచ్చెను ఆగస్టు పదిహేను,
మది హెచ్చెను ఆనంద మిదిగోను!
స్వాతంత్ర్యము వచ్చిన రోజు,
స్వారాజ్యము తెచ్చిన రోజు -
ఇదె వచ్చెను ఆగస్టు పదిహేను,
ఇంకొక ఆగస్టు పదిహేను!
సెల విచ్చెను మన కందరికీను,
సిరి కూర్చెను మన దేశముకేను!
పరపాలన తొలగిన రోజు,
మన భాగ్యము పండిన రోజు!
మనజెండా ఎగిరిన రోజు,
మనజాతికి పండుగ రోజు!
జెండాకు వందనము చెయ్యండి,
జై హిందని గొంతులు కలపండి!
దక్షిణ భాగం మనదేను,

ఉత్తర దేశం మనదీను -
భారత దేశం మన దంతా,
భారతీయులం మన మంతా !
తెలుగూ, తమిళం జతకాదా !
దేశభాషలకు తగవేలా?
హిందీ తెలియక పోతుందా !
ఇంగ్లీ షెవరిదో అవుతుందా?
దేశ మొక్కటని తెలియండి,
దేశవాసు లన మనమండి -
దేశభాష లన్నీ మనవే,
దేశభాగ్య మంతా మనదే !
మనజెండా ఎగిరిన రోజు
మనజాతికి పండుగ రోజు -
ఇదె వచ్చెను ఆగస్టు పదిహేను,
ఇంకొక ఆగస్టు పదిహేను!
జెండాకు వందనము చెయ్యండి,
జై హిందని గొంతులు కలపండి !

- 1963

# సరిహద్దున గస్తీ

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ -
రేయనక, పవలనక
సరిహద్దున గస్తీ...

డ్యూటీపై యిష్టం
తలపించదు కష్టం -
దేశంపై భక్తి, ఉ
ద్దీపించును శక్తి!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ-

తెలిమంచులు మించు
దెసల నావరించు -
వలిగాడ్పులు దంచు,
వజ వజ వణకించు!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ!

ఎగయుపొగయు కొండలు,
ఎగరొప్పును గుండెలు -

చరియల గుండ్రాళ్లు,
చదలున రండోళ్లు!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ-

ఇటుపక్కన లోయ,
ఎరుగరాని మాయ -

అటు పొంచిన దాయ,
అసలు సిసలు బోయ!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ-

ఎగుడుదిగుడు బాట,
యమునితో చెరలాట -

కొండనంటి సాగు,
కొండచిలువ లాగు!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ!

మారుమూల లడఖ్,
మరుగుపడిన సడక్ -

ఇసుకపర్ర లెచట,
నీటికి కరు విచట!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ!

సరఫరా విమానం,
సాహసయుత యానం -

శిఖరాలతో భేటీ,
మేఘాలతో పోటీ?

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ -

కారడవుల నేఫా,
కాదిది ఒక సోఫా -

పాములతో దోస్తీ,
బాముల కిది బస్తీ!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ!

జడివానలు జాస్తీ,
జలగలతో జోస్తీ –

జీపులకే సుస్తీ,
జీవులకు అవస్థే!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ –

చైనా ఒక మస్తీ,
జవ్వానే మావటీ –

చైనా జబర్దస్తీ
తీసిందో కిస్తీ!

సరిహద్దున గస్తీ,
చలితోనే కుస్తీ –

చైనా ఒకమస్తీ, జ
వ్వానే తగు మావటీ –

కలబడిన యీ దఫా,
కావిస్తాము సఫా!

సరిహద్దున గస్తీ,
చలితో నే కుస్తీ –
జవాను ప్రసక్తి, నా
జవాను ప్రశస్తి–
బహాదురీ ఆస్తి,
భయమనేది నాస్తి!
సరిహద్దున గస్తీ,
చలితో నే కుస్తీ!
శాస్తి, కపటమైత్రికి –
స్వస్తి, భరతధాత్రికి !

## క్రోధి ఉగాది

ఎదుట నిలిచింది ఉగాదిగా,
ఏం చూస్తావు ఎగాదిగ?-
కదలి వచ్చింద క్రోధిగ,
కలయ చూచింద బాధగ?
కనలె, 'ఆయు' బున్మాదిగ
కయ్యమునకు కాల్దువ్వగ-
కలగె, కనగ వేలాదిగ
కాందిశీకులను నెవ్వగ -
పాకిస్తాన్ మన దాయాదిగా,
పెంచె కాశ్మీరు వివాదగ-
చైనా శాంతికి విరోధిగా,
చెవి కొరికె నేమొ తలపడగ -
పాకిస్తాన్ మతవాదిగా,
పరమతస్థులకు కాదుగా-

త్రోసె వారి పరవారిగ,
తూర్పు బెంగాలు వీడగ -

చైనాది ద్రోహబుద్ధిగా,
చేసె సరిహద్దు తగాదగ -
పేర్చె తనసేన హద్దుగ,
చేర్చె మననేల పద్దుగ -

'ఆయూబు' - 'చౌ' ల పగా, దగా
హత్తుకొనియె సయ్యోద్దగ —
తోడుదొంగలై చరింపగ,
దురాక్రమణ సాగింపగ —

బదులు చెప్పింద అగాదుగ,
కదము త్రొక్కింద జోదుగ ?-
ఏం చూస్తావు ఎగాదిగ?
ఎదుట నిలిచింది ఉగాదిగా !

భయము మాన్పు హితబోధిగ,
జయము గూర్చు రథచోదిగ-
ఎదుట నిలిచింది ఉగాదిగా,
ఎత్తు నివ్వాళి వేవేగ !

ఆత్మశక్తి ప్రసాదిగ,
ఆత్మరక్షా వినాదిగ -
ఎదుట నిలిచింది ఉగాదిగా,
ఎత్తు నివాళి భక్తిగ!

ఐక్యభావ సంపాదిగ,
అప్రమత్త సైన్యాదిగ -
ఎదుట నిలిచింది ఉగాదిగా,
ఎత్తు నివాళి శ్రద్ధగ!

స్నేహసంప త్సమృద్ధిగ,
నిఖిల సాహాయ్య లబ్ధిగ -
ఎదుట నిలిచింది ఉగాదిగా,
ఎత్తు నివాళి తృప్తిగ!

దేశ భద్రతా సిద్ధిగ,
దేశ భాగ్యాభి వృద్ధిగ -
ఎదుట నిలిచింది ఉగాదిగా,
ఎత్తు నివాళి ఘనముగ!

కర్మభూమి నింపాదిగ,
కాగలదు నిండు గాదిగ!
శాంతికామి నెమ్మదిగ,
సిద్ధమగు కొండ కోటగ!

ఎత్తు బ్రతుకు నివ్వాళిగ,
ఎడదలో కోర్కె లూరగ -
ఏం చూస్తావు ఎగాదిగ?
క్రోధి సంవత్స రాదిగా!

రంగారు బాలా, ప్రోదిగ
రాగలకాలము నీదిగా !
క్రోధి సంవత్స రాదిగ
రాగలకాలము నీదిగా !

# మామిడి పిందె మజా

అన్న : ఇదిగో, యిదిగిదిగో– ఓ మామిడిపింది!
ఇపుడే రాలింది, కడు యింపైన పిందె–

చెల్లి : నిగనిగ లాడూ తోంది,
'నను చూడు' అంటోంది!

అన్న : ఈ కన్నుల పడింది,
ఇంకెటు పోతుంది ?

చెల్లి ! నవనవ లాడూ తోంది,
'నను కొరుకు' అంటోంది !

అన్న : అబ్బా, నిన్ను తినమంది–
ఆఁ, నాకు దొరికింది !

చెల్లి : 'నను కొరుకూ' అంటోంది,
నో రూరూ తోంది !

అన్న : కంగా రెందుకులే,
కాకెంగిలి చేస్తా–

చెల్లి : నవనవ లాడూ తోంది,
నా నో రూరూ తోంది !

అన్న : తిందాంలే చెరిసగం,
తిన్నగా పెట్టు ముగం

చెల్లి : నీకో చెక్కా, నాకో చెక్కా—
తిందాం ఎంచక్కా !

అన్న : కంటి కైంది విందు, అహ
పంటికా పసందు !

చెల్లి : ఉప్పూ, కారం అద్దుకుని
ఊరిస్తూ తిందామా?

అన్న : వగరు మేసి కోకిలతో
వంతులాడ దామా?

చెల్లి : కో

అన్న : కో

చెల్లి : కోయంటే

అన్న : కోయంటూ

చెల్లి : కోకిల నాడిద్దామా?

అన్న : కూతలు వేయిద్దామా?

# పాపల పండుగ

బాలుడు : ఎర్రనిరోజా ధరించుతూ,
జిర్రున చీదక చరించుతూ
ఎల్లర నాక
ర్షించిం దెవరూ?

అందరు : చాచా నెహ్రూ
సాటి ఎవ్వరూ!

బాలిక : పాపలన్న సంబరపడుతూ,
పాపల సంతోష పెడుతూ
పాపల నేస్తం
కట్టిం దెవరూ?

అందరు : చాచా నెహ్రూ
సాటి ఎవ్వరూ?

బాలుడు: గాంధీతాతకు ఇష్టుండై,
భారతమాతకు జ్యేష్ఠుండై

కొలిచిం దెవరూ,
నిలిచిం దెవరూ?

అందరు : చాచా నెహ్రూ
నాటి ఎవ్వరూ !

బాలిక : గాంధీ నీతికి ప్రకాశమై,
భారత జాతికి ప్రధానియై
మెలగిం దెవరూ,
వెలిగిం దెవరూ?

అందరు : చాచా నెహ్రూ
సాటి ఎవ్వరూ !

బాలుడు : నీ పుట్టిన రోజయిన
నీ కొక్కతెకే పండుగ –

బాలిక : అవును,
నీపుట్టిన రోజయిన
నీ కొక్కడికే పండుగ –

బాలుడు : అవును,
నెహ్రూచాచా పుట్టినరోజు
నీకూ నాకూ కూడా పండుగ !

అందరు : భారతజ్యోతి పుట్టినరోజు
బాలభారతికి పండుగ రోజు !

బాలిక : పాపల కన్నీ కావాలంటూ,
పాపలు వృద్ధికి రావాలంటూ
పాపల బాగును
కోరిం దెవరూ?

అందరు : చాచా నెహ్రూ
సాటి ఎవ్వరూ?

బాలుడు : పాపలే రేపు నాయకులని,
పాపలే దేశ భాగ్యంబని
పాపలను పెద్ద
చేసిం దెవరూ?

అందరు : చాచా నెహ్రూ
సాటి ఎవ్వరూ?

బాలిక : పాపల బంధువు పుట్టిన రోజు
అందరు : పాప లందరికి పండుగ రోజు!

బాలుడు : దేశమ్మును ప్రేమిస్తాము
బాలిక : దేశమ్మును సేవిస్తాము

అందరు : శపథము మేమిదె చేస్తాము!

బాలుడు : జనహాసులై వికసిస్తాము

బాలిక : జాతికి పేరును తెస్తాము

అందరు : శపథము మేమిదె చేస్తాము!

బాలుడు : పాపల బంధువు అమరు డోహో!

బాలిక : పాపల పంచువు అతని కోహో!

×

# నెహ్రూ జ్ఞాపకాలు

మన సారథి,
మన సచివుడు
నెహ్రూ యిల లేడన్నది
నేడే అని పించింది -

మన సఖుడు,
మన బాంధవుడు
మనల వీడె నన్నది, ఈ
నాడే గుండె నాటింది -

నెహ్రూ హీనమైన
స్వాతంత్ర్య దినం
నిట్టూర్పుతో నేడు
జరుపుకున్నాం మనం -

నిండు మనస్సుతో చాచాను
తలుచుకున్నాం,

నువ్వు చూపిన బాటనే
నడువగల మన్నాం-

నేను దేశంలో సాగుతున్న
వెయ్యిన్నొక్క పతకాలు
నెహ్రూ చాచాను గురించిన
తియ్యతియ్య జ్ఞాపకాలు !

- 1964

# పక్షి - మనిషి

పక్షికి దేవుడు
పక్షా లిస్తే -
పన్నుగ నాకస
పదమున కెగిరి,
ఉల్లాసమ్మున
పల్లటీలతో
గళము ద్రవింపగ
గానము చేసి
పుడమిని పరముని
పొగడిత నించెను!

మనిషికి దేవుడు
మనీష నిస్తే -
జడముల కదల్ప
జాలిన శక్తిని
విమానములపై

విన్నున కెగసి,
ఫెళ ఫెళ బాంబుల
ప్రళయం కురిసి
శ్రోటివాండ్ర తు
త్తునియలు చేసెను -

(ఇంగ్లీషునుంచి) - 1945

# చెట్టు

మండు ఎండ
మింగి తాను,
మరుగు జొచ్చు
మనకు గొడుగు
పట్టి నిలుచు –
చెట్టు!

విసరు రాళ్లు
మొసవి తాను,
మనసు హెచ్చు
మనకు పండ్లు
పెట్టి కొలుచు –
చెట్టు !

"ఒక మధురమూర్తి మానిత స్వప్నం,
ఒక మహాశక్తి మానని యత్నం–
మనిషి కాదు, మనుష్యకోటి!
మనికి కాదు, మహత్తరధాటి!–
ఎరుగవో, ఆంధ్ర మహిళాసభ?
ఎరుగవే, ఆంధ్ర మహిళ ప్రభ?"